ఆంధ్ర సంజీవని గ్రంథమాల

అనుబంధము 3

# ప్రేమలత

మొదటికూర్పు 1000 ప్రతులు.

PRINTED AT THE KING & Co's
L. N. PRESS,
VIZAGAPATAM.

1924





**Price Rs 0-1-6**

శాంతిప్రవది :—

# — • శ్రీమతాంబ • —

(అపరాధ పరిశోధక నవల.)

గ్రంథకర్త :—

బ్రహ్మశ్రీ కేసరపు వెంకటశాస్త్రిగారు.

---

శాస్త్రిగారి వాగమృతధారల గ్రోలుటకు
భాషాభిమానుల కిదియే మంచి తరుణము.

ఇంపలి హాస్యౌచిత్యము, శృంగారరసము, వర్ణనాతీతములు— హృదయమును భేదించు వర్ణనలు— అత్యంత మృదుమధురమై యలరారు శైలి— వేయేల? గ్రంథమును చదువ నారంభించిన, ముగించువరకు విడువనొల్లరు— అతి సుందరము! మనోహరము! శ్రవణసుఖము !

శ్రీరస్తు.

శుభమస్తు-అవిఘ్నమస్తు.

# ప్రేమలత.

## మొదటి ప్రకరణము.

### మహేంద్రవర్మ.

శ్రీగలకుందావలంబయి, విశ్వవిఖ్యాతమై, విద్యానిలయమై, అతిలోకరమణీయంబయి మోహనపురమను నగరము సర్వజనసంతోషకారిగా శోభిల్లుచుండెను. ఆపురము సంపదఁకు కాపురమై, అసమాన సుందరాంగులగు రమణీ రత్నములతోడను, నిరంతర భోగపరాయణులగు పురుషులతోడను, విరాజమానమై యుండెను. తత్పురాధిపతి శిష్టజనులను రక్షించుచు సత్యవాక్పరిపాలనాతత్పరుఁడై రా

జ్యపాలనాధురంధరుఁడై, శ్రీరామమూర్తివలె ప్రజారంజకముగా రాజ్యమును బరిపాలించుచుండెను.

ఆమోహనపురమును బరిపాలించు రాజపేరు మహేంద్రవర్మ. అతనికి శిల్పపుఁబనియనిన నిక్కలియిష్టము. చిత్రలేఖనముకూడ నతనికి మిక్కలి ప్రియమైనది. కావున నారాజశేఖరుఁడు తన నగరమునందెల్లెడలను, దేవాలయములు, గుళ్ళు, గోపురములుకట్టించి వానిపై పురాణములందును జరిత్రములందును బ్రసిద్ధికెక్కిన రాముఁడు, ఆంజనేయుఁడు, కృష్ణుఁడు, మొదలగువారిప్రతిమలను జెక్కించి. విచిత్రములును, వివిధములగు రంగులును వానిపైవేయించి తానానందించుచు, చూపరు నానందపరవశాత్ములఁ గావించుచుండెను.

ఆరాజచంద్రుఁడతివివేకశాలి. మిక్కిలిమంచివాఁడు. వివిధసద్గుణశోభితుఁడు. "యథా రాజా తథాప్రజా" యనునట్లు రాజువలెనే ప్రజలుకూడ న్యాయదీక్షాపరులు. సత్యదేవత వారిజిహ్వాగ్రమున నిండుతేజస్సుతో తాండవించుచుండెను. అతనిపాలనమున జనులెల్లరును రామరాజ్యమునందువలె నిష్టసుఖము లనుభవించుచుండిరి. వారిరాజభక్తి

యద్వితీయము. తమ రాజేంద్రుని విషయమై స్వ ప్రాణములను ధారవోయుటకైనను, వారు సంకో చింపరు. వారెల్లరును తమకు జన్మజన్మాంతరముల యందు మహేంద్రవర్మయే తమకు రాజగునట్లుగా ననుగ్రహింపవలయునని దైవమును పలుగతుల బ్రార్థించుచుండిరి. ఆహా! వారి రాజభక్తి యద్వితీ యమైనదని నెక్కువ వక్కాణించుటకేమయిన సంది యమున్నదా!

ఇట్లు జనులెల్లరును సత్ప్రవర్తకులై వర్తిం చుచుండ వారల క్షేమమునకై మహేంద్రవర్మ నీ టికిబ్బంది లేకుండ నెల్లయెడల నీటివసతులు గట్టించి యాగతికులగు బీదలకన్నదానము చేయుచు ధర్మ సత్రములు గట్టించి, పెద్దపెద్దబాటలు ప్రయాణసౌ కర్యమునకై వేయించి బలురీతులఁ బాటుప డుచుండెను. తత్కారణమున నాపురజనులు కొఱఁవ మనుమాటలేక క్షేమముగాఁ గాలముపుచ్చుచుండి రి. మహేంద్రవర్మ విద్యాప్రియుఁడగుటచే పాఠ శాలలను గట్టించెను. జనులెల్లరును అన్యోన్యకల హములు మానుకొని కష్టకాలమున నొండొరుల కు సహాయముఁ జేసికొనుచుండిరి వారు "పౌరుష

గియు రాజద్రోహియు నగు చక్రపాలుఁడు నీసికి సహింపఁజాలక కొంతసైన్యమును స్వీకరించి, యతనిని రాజ్యభ్రష్టుఁ గావించి దానే స్వయముగా రాజ్యమును బరిపాలించుచుండెను. పాపము రత్నసేనుఁడు కుమారునితో చంద్రసేనసహితముగా నే యారిలోనో యేయరణ్యములలోనో యజ్ఞాతవాసము చేయుచుండెను. ఇఁక వారిజాడయే లేదు. అయినను ప్రేమలత చంద్రసేనునిమీఁదనే యనురాగమువహించి యతఁడు లభింపనిచో యావజ్జీవమును బ్రహ్మచర్యమును సలుపఁ గృతనిశ్చయురాలయ్యెను.

## రెండవ ప్రకరణము.

### వివాహ నిశ్చయము.

---

మన కథాకాలమునాఁటికి, ఆనందపురము సకలసంపదలకు సదనమై, భరతఖండమునకు తలమానికమువలెఁ దనరారుచుండెను. తత్పురపరిపాలకుఁడు కనకపాలుఁడు అతఁడు గర్వాంధుఁడు. గర్వ

మెట్టివారినైనను జెఱచునుగదా! కాని కనకపాలుని రాజ్యమదాంధతవలన నాతనిగర్వముకూడ నిరాఘాటముగా సాగిపోవుచుండెను. అనలమున కనిలము తోడ్పడినట్లుగా దుర్గుణసముపేతుఁడగు కనకపాలునికి కుబుద్ధియగు రఘునాథుఁడను మంత్రి తోడయి యనేకవిధములగు దుర్మంత్రము లుపదేశించుచు రాజును మఱింత క్రూరునిగాఁ జేసివైచెను. ఇఁక నా కనకపాలుఁడు తనదుష్టమంత్రి సహాయమున జేయని దుష్కార్యమేమున్నది? అతఁడు చేయు ఘోరకృత్యములన్నిటిలో ముఖ్యమగుపని జనులను బీడించుటే? అతఁడు బీదలనక, సాదలనక ధనికులనక, ధార్మికులనక, వీరనక, వారనక తోఁచినవారందఱియొద్ద నిష్టమువచ్చినంత ధనమపహరించి యాఅన్యాయపుధనముతోఁ దనబొక్కసము నింపుకొనఁజొచ్చెను. కావున జనులందఱును తమకీ రాజుబాధ తొలఁగింపుమని తమతమ యిష్టదేవతలకు వేవిధముల మ్రొక్కుకొనుచుండిరి

కనకపాలునికి రాజసేనుఁడను నొకపుత్త్రుఁడుగలఁడు. అతఁడును తండ్రివలెనే దుష్టుఁడు. అందుఁగా సౌందర్యవిలసితుఁడుగా నున్నను కురూపిమా

త్ర్యముగాఁడు. అతఁడొకనాఁడంతఃపురమున నుండఁగా చారులొకనొక చిత్రపటముఁదెచ్చి చూపిరి. అతఁడిదివఱకెందఱో రాజపుత్రికలను జూచెనుగాని యందు జిత్రింపఁబడిన సుందరివంటి సుందరిని జూడలేదు. ఆ పటమును జూడగానే యందు జిత్రింపబడియున్న ప్రేమలతపై మోహము జనించెను. తుద కెన్నోవిధమైన ప్రయత్నముల చేతనైనను నామెను పెండ్లాడునట్లాతఁడు నిశ్చయించుకొనెను. రాజాధిరాజకుమారుఁడగు రాజసేనునకీ కార్యమొక లెక్కలోనిది కాదుగదా! అతఁడు తన జనకునితోఁ దనవాంఛితమును దెలియఁజేసెను. ఆదిమంత్రియగు రఘునాధుఁడు విని, రాజసేనునకు ధైర్యముగొల్పుచు "రాజకుమారా! ఇందులకై నీవు చింతింపనేల? ఇదెంతపని, మహేంద్రుఁడు మన చేతిలోనివాఁడేకదా! అతఁడు మన సంబంధముఁజేకొనుటకిష్టపడకుండునా? అతఁడు వేయేండ్లు తలక్రిందయి తపస్సుజేసినను మనయట్టి రాజాధిరాజుల సంబంధము దొరకునా? ఇఁకవివాహవిషయమై సందియము వీడుము. ప్రేమలత నీదియని నమ్ముము. మన సందేశముఁజెప్పినచో మహేంద్రవర్మ

మహానందపూర్ణహృదయుఁడై తప్పక తనకూఁతున రిప్పించును. అట్లాతఁడొప్పుకొనఁడేని వానిని నిర్బంధించి యడుగవచ్చును. అప్పటికిని సమ్మతింపఁడేని దండోపాయమున వానినెదిర్చి పలుబాధలం బెట్టి వానినోడించి తమకాకన్యనిచ్చి రాక్షసవైవాహిక మొనరించెదము. కావున మీరు సంతుష్టాంతరంగులై యుండుఁడనెను. పిమ్మట గనకపాలుఁడు తనకుమారుని సంబంధముఁ జేసికొమ్మని మహేంద్రవర్మకప్పుడే యొకకమ్మ వ్రాసిపుచ్చెను. మహేంద్రవర్మ దది సకాలమ్మున నందగా నతఁడద్దానిని విప్పికొని యిట్లు చదువుకొనియెను.

“మా సామంతరాజగు మహేంద్రవర్మ రాజచంద్రునికి:—

ఓయీ! నీకు రమణీలలామంబును, సర్వాంగసుందరియునగు ప్రేమలతయను కూఁతురున్నదఁట. ఆమెను మాకుమారుఁడు వాంఛించియున్నాఁడు. దానినితప్ప తదితరులను పెండ్లాడనని పట్టుబట్టినాఁడు. కావున పెండ్లిసన్నాహములతోఁ దత్క్షణమా బయలుదేరఁగలము. మేమిక్కడ తత్ప్రయత్నములలో నుందుము. నాయాజ్ఞ యనుల్లంఘనీయమని

యు, నాపట్టు భల్లూకపుఁబట్టనియుఁ దెలిసిన నీవు నన్ను నిరసింపనేరవు.

ఇట్లు,

భవచ్ఛ్రేయోభిలాషి,

క న క పా లుఁ డు.”

ఆ లేఖను చదువుకొనఁగానే మహేంద్రుని గుండెలు గటతటఁ గొట్టుకొనసాగెను. అతని హృదయాకాశమున ననేకవిధములగు నాలోచనాపరంపరలు వెల్లి విరియసాగెను. తన ముద్దుకూఁతురా రాజసేనుని వివాహమాడుట కియ్యకొనునో లేదో యాతనికిఁ దెలియదు. ప్రేమలత రాజసేనుని బెండ్లాడనిచోఁ దనకు రాజ్యభ్రష్టత్వముకూడ దప్పదని యాతనికిఁ దెలియును. అప్పుడాతఁడు సందిగ్ధమనస్కుఁడయ్యెను. తనకూఁతునకిష్టము లేని వరునికిఁ గట్టిపెట్టి యామెసుఖమును జెఱచుటా? లేక ప్రభువునాజ్ఞ తిరస్కరించి రాజ్యమును గోల్పోయి కాననములఁ గాలము గడపుటా? యని యతఁడాలోచింపసాగెను. అతని కేమియును తెలియదయ్యె

ను. ఎంతసేపు యోజించినను కర్తవ్యము బోధపడు
టలేదు. తుదకాతఁడు కూఁతు నుద్దేశించి "అమ్మా
యీ! రాజాధిరాజగు కనక భూపాలుని పుత్త్రుఁడగు
రాజసేనుఁడు నిన్ను వరింపనెంచి, తదర్థంబై శుభ
లేఖార్థంబులుఁ బంపెను. అట్టి గొప్పవారితో సం
బంధబాంధవ్యములుండుట మున్ముందు మనకు మి
క్కిలి యుపయోగకారియగును. లేనిచో వారికిని
మనకును తీరని వైరము సంభవించును. ఇందు నీ
యుద్దేశమేమి?" అని ప్రశ్నించెను. ప్రేమలతకా
వృత్తాంతమిదివఱకే తెలియుటచే మారు చెప్పక
మౌనముద్రితయై మిన్నకుండెను. కాని యామెకు
మనస్సులో దుఃఖము లేకపోలేదు. ఆ రాజసేనుని
బెండ్లాడుటకంటె నాత్మహత్యఁ జేసికొనుట మేలని
యామె తలఁచు. కాని యామె తల్లిదండ్రులను దుఃఖ
పరుప నిష్టము లేదు. కావున దేవునిపై భారముంచి,
కానున్నది కాకమానదనియు, సర్వేశ్వరుఁడగు
పరమేశ్వరుఁ డెప్పుడు, ధర్మపక్షావలంబియై కాని,
యనాథులకు బాధ కలిగించువాఁడు కాఁడనియు నె
ఱింగి, ధైర్యమవలంబించెను. ఆహా! ఈమె పితృభ
క్తి యద్వితీయము కదా!

## మూ డ వ ప్ర క ర ణ ము.

### ——అంతర్ధానము——

మహేంద్రవర్మ తనకూఁతు రేమియు ననకుండుటచే మౌనమర్ధాంగీకారమను వాక్యమువలన నమ్మతించెననియు నొక రాజాధిరాజునకుఁ గోడలు కానున్నదనియు, దానివలన తనకు విశేషలాభము, గౌరవముకలుగునని దలపోసికొని యుప్పొంగిపోవుచుండెను. అందుచే నతని పూర్వపుసంతాపమెల్ల మాయమయ్యెను. తనకుమారికను దప్పక కనకభూపాలునిపుత్రునకిచ్చి వివాహముఁ జేయవలెనని కృతనిశ్చయుఁడయ్యెను. సిరిరామో కాలొద్దువా రెవ్వరున్నారు? ధనలక్ష్మి జగన్మోహినికదా! ధన మూలమిదం జగత్తను వాక్యమున్నది! ధనాశాగ్రస్తుఁడై మహేంద్రవర్మ కనకపాలునికుమారునకుఁ దనకూఁతునొసఁగ నిశ్చయించెను. అతఁడు మొట్టమొదట తనకూఁతునకు

నీ సంబంధమును జేయ నిరసించెనుగాని తుదకు ధనాశచేతను, తనకంటె నెక్కువ యాధిపత్యముగల రాజుమాటలందలి గౌరవముచేతను సంతవాని సంబంధము చేసికొనుటవలన నందరకు కీర్తికలుగునన్న యాశచేతను తుట్టతుదకు వివాహము నంగీకరించెను.

అట్లాతఁడు కృతనిశ్చయుఁడై మహోత్సవముతో వివాహప్రయత్నము లొనరించుచు కనకపాలునికి దావచ్చుచున్నానని చారులచే వర్తమానమంపెను. అంతట కనకపాలుఁడుకూడ మహానందముతో నెదురుసన్నాహము లొనర్చుచుఁ బెండ్లివారి రాకకు నిరీక్షించుచుండెను. మోహనపురమున వివాహప్రయత్నము లెడతెరిపిలేకుండ జరుగుచుండెను. ప్రతివాఁడు నేదోయొక కార్యమునొనర్పసంసిద్ధుఁడై యుండెను. తమరాజపుత్రిక వివాహమని యెఱుఁగుటచే జనులందఱు నూతనవస్త్రం నంశోభితులై [illegible] సొగసు [illegible] కొని [illegible] హూ[illegible]. [illegible] రమున [illegible] త మై నిండుతేజస్సుతో [illegible] పీక్షించెనను

దానియై నర్తనమాడుచుండెను. అట్టి సర్వజ నాహ్లాదకరమగు సమయమున రాజసౌధాంత రాళమున నొక నెలత క్షీరసముద్రముపై శయ నించిన మహాలక్ష్మియోయనునట్లుగాఁ బరుండియుం డెను. కాని యామెకు నిద్రపట్టుటలేదు. విక సితజలజసన్నిభమైన యామె ముఖమిప్పుడు విచారమునకు లోనయి చంద్రస్పర్శకుఁ గమలము వలె వాడిపోయెను. ఆమె యనేకాలోచనాని మ గ్నమానసయై, దురంతచింతాకులస్వాంతయై కన్ప ట్టుచుండెను. ఆమె నయనగోళములనుండి యప్ప టప్పట గొన్ని బాష్పబిందువులుపడి యామె పరుం డియున్న పరుపును దడిపివైచెను. దీనినిబట్టి చూ డఁగా నామెయొక దుఃఖభాగినియని తెలియుచున్న ది. ఇఁక సందియమేల? రాజసేనుని బెండ్లాడ నిరసించి యిట్లు దుఃఖించుచున్న యీబాలలితామణి మన ప్రేమలతయే! ఆమె తనపయ్యెదచెఱఁగుతో ననర్గళమై వచ్చుచున్న బాష్పబిందువులను దుడి చికొనుచు "అక్కటా! ఇఁక నాకీజన్మమెందుకు? ఈనాశరీరము వ్యర్థము కదా! నేను సౌందర్యవంతు రాలనని పొంగిపోవుచుంటినిగాని ఈ సౌందర్యమే

నాకీ దుఃఖమును దెచ్చిపెట్టినదే! మఱియు నేనే
మియు మాట్లాడకుండుటవలననే నాకింతటిముప్పు
తటస్థించినది. నేను సిగ్గువదలి మాతండ్రితో వా
నిని పెండ్లాడనని నిష్కర్షగా వచించినచో అతఁడీ
వివాహమున కేలఁ బూనుకొనును? ఇంతకు నాకర్మ
మిట్లుండ దానికై చింతించినను లాభమేమి? అ
కటా! దైవమా! నీవు నన్ను పుట్టింపకున్నను బా
గుండునే! పుట్టించితివి సరే! ఒక సామంతరాజగ
ర్భమున నేల పుట్టించితివి! అట్లే చేసితివనుకొందము!
నాకీ సౌందర్యమేలగలిగించితివి? కలిగించినను నా
కీదుస్సంబంధమేల కట్టిపెట్టితివి? అయ్యో! అయ్యో!
దైవమా! నాయట్టిదీనురాలిపై నీకిట్టి క్రౌర్యమేం
దులకు! నామనోరథము నీడేర్పరాదా? ఇఁక నేనీ
విపత్సముద్రమును దరింపఁగలుగుటెట్లు? జయించిన
ను నాసుందరాకారుని కన్గొనుటెట్లు? అయ్యో!
ఇన్ని కార్యములెట్లు సంఘటింపఁగలవు! ఇఁక నేనే
మిచేయుదును! నాజనకునితో నిప్పుడు చెప్పికొందు
నా? అయ్యో! అతఁడింకను నామీఁద ప్రేమతోడ
నేయున్నాఁడా? దురాశాగ్రస్తుఁడై నన్ను చేతులార
ఆనాగుబామునకప్పగింపఁజూచుచున్నాఁడు? హా!

కొంత మదోన్మత్తులు! పిచ్చుకపై చంద్రాయుధ
మన్నట్లు, నిరపరాధులమగు మాపై తమయధికార
మంతయు జూపుచున్నాడు. కాని తన్మనోరథమీడేరు
నా? నాప్రాణములు నిల్చునా? అయ్యో! ఏమి నా
యధైర్యము! నేను పూనుకొనినచో నెవ్వరు నన్న
డ్డువారు! నే నాత్మహత్యఁ జేసికొందునా?
ఛీ రా! ఎంతపని! తొల్లి దమయంతీదేవి పలుబా
ములుపడియు తన ప్రాణనాథుని గలియలేదా!
అట్లే నేనెన్నికష్టములనుబడియైన నానవమన్మథుని
గలిసికొందును. లేకున్న, రుక్మిణీదేవి తొల్లి శిశు
పాలునికిఁ దన్ను గూర్చుచున్నప్పుడు కృష్ణునికై ప్రా
ర్థింపఁగా అతఁడువచ్చి యామెను వివాహమా
డలేదా! కావున నింతటిలో నేనధైర్యపడకూడదు."
అని తలపోయుచు గొంతసేపూరకుండ మరల ను
ర్చలచిత్తయై "అయ్యో! నామనోరథమీడేరుట
దుర్లభము. మాతండ్రి నన్నాతుచ్ఛునకు గట్టబెట్ట
నెంచినాఁడు. నేను నాపితృదేవత వాక్కు జవదాఁ
టలేను. నొకవేళ నభిలషించిన భర్త నాకు దొర
కకున్న నేను సంసారాభిలాష త్యజించి యే పుణ్య
క్షేత్రమునకో పోయి కాలముగడపెద" నని నిశ్చ

యుంచుకొనియెను.

అంతలో మరల నీమెకుఁ దోడ్పాటుగా మేఘములు చంద్రుని గప్పివేసెను. చీఁకట్లు నలుదిక్కుల నలముకొనియెను. ఆసమయము గనిపెట్టి ప్రేమలత మిక్కిలి జాగరూకతతోఁ బరులకుఁ గోచరింపకుండ నంతర్ధానమయ్యెను.

---

## నాల్గవ ప్రకరణము.

### కనకపాలుఁడు.

---

మోహము మిక్కిలి యపాయకరమైనది. మోహావేశహృదయుల చేష్టలు విచిత్రములు. అవి వర్ణనాతీతములు. అభిలషితవస్తువు దుర్లభమని తెలిసినప్పుడు ప్రాజ్ఞులు తమ చిత్తములను మరలించుకొని సుఖింతురు. మూర్ఖుఁడది తెలిసియు మిక్కిలి ప్రయత్నించి విఫలమనోరథులయి వంతలపాలగుదురు. ఇట్టివారిలో రాజసేనుఁడొకఁడు. అతఁడు ప్రేమలతను మనసారఁ బ్రేమించెను కాని యామె

యతనియందు విరక్తయైయుండెను. ఇది తెలిసి కొనియా రాజసేనుఁడూరకుండక యామెనుంక్షిమ నస్సు మరలించుకొన లేకపోయెను. ప్రేమలత యంతర్ధానమైనదన్న సమాచారము వినఁగానే రాజసేనుఁడు సంతత విచారమగ్నుఁడై నిర్వ్యాపారుఁడై యుండెను. కుమారుని చర్యవిని కనకపాలుఁడు దుఃఖాక్రాంత చిత్తుఁడయ్యెను. ప్రేమలతని యావత్సరంతో షమీవిధముగా దుస్సహవిచారానలముగాఁ బరిణమించునని తెలిసికొనఁజాలకపోయెను.

కుటిలాత్ముఁడును మంత్రియునగు రఘునాథుఁడు తమ ప్రభు విచారమును దెలిసికొని యాతని నుపలాలన చేయనెంచి సమీపించి "మహాప్రభూ! చూచితిరా! మనము మహేంద్రవర్మ మాయలలోఁబడి పూర్తిగా మోసపోతిమి. అతఁడు తనకుమారిక పారిపోయెనని యొక ప్రథ పుట్టించి, యెక్కడనో దాచియున్నాఁడు. లేడిపిల్ల సింహమును ధిక్కరించుచున్నది. మనమిఁక వెనుతీయక మహేంద్రవర్మను బాధించినచోఁ గుమారిని దెచ్చి తప్పక యిప్పింపఁగలఁడని" మనవి చేసెను.

కనకపాలునకు మంత్రి యాలోచనము నచ్చినది. ఆవిషయమునన్నై యతనికిని ననుమానమున్నది. ఆ యనుమానమును మంత్రివాక్యములు రెట్టించెను. అందువలన నతనికి శోకముతోఁ బాటు కోపముకూడ పూర్ణముగాఁ గలిగెను. మహేంద్రవర్మను, అనునయించియో హింసించియో ప్రేమలతను దీసికొనిరావలయునని యెంచెను. అందువలన, నతఁడు మంత్రితో "ఓయీ! ఇప్పుడే వానికి నా యాజ్ఞగాఁ దత్క్షణము ప్రేమలతను దెచ్చియిచ్చునని యు, లేకున్న యుద్ధమునకు సిద్ధపడియుండుమనియు వ్రాయుము" అని పలికెను. "రాజానుమతో ధర్మః" యను వాక్యమునకుఁ లోబడి మంత్రి యట్లే చేసెను. పాపము పుత్రికావియోగ చింతా భరమున స్రుక్కి స్రుక్కి యున్న మహేంద్ర వర్మకుఁ "గునుకు నక్కమీఁద దాటిపం" డను నట్లిట్టి యిక్కట్టు ప్రాప్తించెనో చూడుఁడు. అతఁడు కనకపాలుని దౌర్జన్యమునకుఁ జలించియుఁ గొంచెము ధైర్యము తెచ్చుకొని వినయగర్భితముగా "నయ్యా! ప్రమాణపూర్వకముగాఁ జెప్పుచున్నాను. నా కుమారిక నిజముగా నే, బలాత్తి

యయ్యెను నిష్కారణముగా దీనుఁడనగు నాపై నిట్టి యపనింద మోపకుఁడ" ని రాజునకొక లేఖ పంపుకొనెను కాని కనకపాలుఁ డింకను, మహేంద్రవర్మ వాక్యములను విశ్వసింపలేను.

తదనంతరము మహామంత్రియగు రఘునాథుఁడు రాజునుజేరి యతనితోడ "రాజా! వీఁడు మిక్కిలి నీచాత్ముఁడు. మోసగాఁడు. చూచితిరా! వీని సకల వినయములు! అతి వినయము ధూర్తలక్షణమ్మనియెడు నార్యోక్తి వీనియెడ్ల నిజమయ్యె! వీని నేమి చేసినను పాపమున్నదా? ఇఁక వీనిని మనము క్షమింపకూఁడదు. నానావిధ బాధలు పెట్టవలయును. సైన్యముతో దండెత్తిన, పారిపోవుటో, శరణుజొచ్చుటో జేయును. కావున వీనిని హింసింపవలెను." అనియెను. ఆ వాక్యములకు రాజంగీకరించెను. చక్రవర్తియగు నాతనికడ్డేమున్నది! "రాజు తలఁచిన దెబ్బలకుఁ గొదువా?" అందువలన నాతఁడు మహేంద్రుని బలు చిక్కులఁ బెట్టుచుండెను. క్రొత్తపన్నులు విధించుచుండెను. ఇట్టిన్ని బాధలు పెట్టినను ఫలము లేకపోయెను. ప్రేమలత చిక్కలేదు. రాజసేనుని మోహావేశము



శ్రీరస్తు.

శుభమస్తు-అవిఘ్నమస్తు.

# ప్రేమలత.

## మొదటిప్రకరణము.

—మహేంద్రవర్మ—

శ్రీలకుం దావలంబయి, విశ్వవిఖ్యాతమై, విద్యానిలయమై, అతిలోకరమణీయంబయి మోహనపురమను నగరము సర్వజనసంతోషకారిగా శోభిల్లుచుండెను. ఆపురము సంపదలకు కాపురమై, అసమాన సుందరాంగులగు రమణీరత్నములతోడను, నిరంతర భోగపరాయణులగు పురుషులతోడను, విరాజమానమై యుండెను. తత్పురాధిపతి శిష్టజనులను రక్షించుచు సత్యవాక్పరిపాలనాతత్పరుడై రా

జ్యపాలనాధురంధరుఁడై, శ్రీరామమూర్తివలె ప్రజా-
రంజకముగా రాజ్యమును బరిపాలించుచుండెను.

ఆమోహనపురమును బరిపాలించు రాజుపేరు మహేంద్రవర్మ. అతనికి శిల్పపుఁబనియనిన మిక్కిలియిష్టము. చిత్రలేఖనముకూడ నతనికి మిక్కిలి ప్రియమైనది. కావున నారాజశేఖరుఁడు తన నగరమునందెల్లెడలను, దేవాలయములు, గుళ్ళు, గోపురములుకట్టించి వానిపై పురాణములందును జరిత్రములందును బ్రసిద్ధికెక్కిన రాముఁడు, అంజనేయుఁడు, కృష్ణుఁడు, మొదలగువారిప్రతిమలను జెక్కించి. విచిత్రములును, వివిధములగు రంగులును వానిపైవేయించి తానానందించుచు, చూపరు నానందపరవశాత్ములఁ గావించుచుండెను.

ఆరాజచంద్రుఁడతివివేకశాలి. మిక్కిలివంచివాఁడు. వివిధసద్గుణశోభితుఁడు. "యథా రాజా తథా ప్రజా" యనునట్లు రాజువలెనే ప్రజలుకూడ న్యాయదీక్షాపరులు. సత్యదేవతవారిజిహ్వాగ్రమున నిండుతేజస్సుతో తాండవించుచుండెను. అతనిపాలనమున జనులెల్లరును రామరాజ్యమునందువలె నిష్టసుఖము లనుభవించుచుండిరి. వారిరాజభక్తి

ము—పొందు లాభము" అను వాక్యము నెఱింగి యెం
తో మైత్రిగా నుండిరి. అప్పట నమరావతీపురమును
డిందుఁజేయుచుఁ దన సౌందర్యాతిశయ్యని సర్వజనుల
కుఁ జూపుచుండెను. అందలిజనులకు తత్పురమున
నివసించుచో స్వర్గసుఖములఁ జవిచూచుట యను భా
వము గలుగు. వారేగాక వారివైభవము జూచినవా
రెవ్వరైనను, అట్లనుకొనక తీఱదు. నటియు మ
హేంద్రవర్మ వైభవ మతనిని నిజముగా మహేంద్రు
ని గావించితీరెను. ఔను! ఎన్నఁడు మోహనపుర
ము స్వర్గమైనదో, ఆనాఁడే తదధిపతి దేవేంద్రుఁడ
గుటలో సందియ మేమున్నది?

అతనికి సర్వాంగసుందరియు, నవమల్లికా
కుసుమకోమలియు, సత్యధిక లావణ్య తేజోవిభాసిని
యు, నగు హేమలత యను కుమారీరత్న మొకతెయు,
మాతృభాషాభిమానియు, మదనసమరూపలావణ్యా
విలాసియు, యుద్ధనిపుణుఁడును నగు సత్కుమారుఁ
డొకఁడును జన్మించిరి. వారిరువురు సమానగుణ
గణాపారీణులు. తండ్రికి గుణములలో నెంతమాత్ర
ముఁ దీసిపోరు. నిజమే! సింహపు కడుపున సింహ
మే జన్మించును కదా!

ప్రేమలత ప్రాముల దేహము పసనారవన్నె బంగారుతోఁ దులఁదూఁగుచు, నిగనిగ మెఱయుచుండెను. మత్తమధుకర శ్రేణీసన్నిభమును, చమరీవాలసదృశమును నగు, నామెకుటిలకుంతలదామము వక్షోద్భాగము నాక్రమించి జానువులవఱకు వ్యాపించి తదీయసహజ సౌందర్యమునకు మెఱుఁగు బెట్టుచుండెను. నవయౌవన విలాసవతియైన నామెకింకను వివాహము కాలేదు. మహీంద్ర వర్మ తన యావచ్ఛక్తిని వినియోగించి వరునన్వేషించుచున్నను నామె కిష్టుఁడగువాఁడొక్కఁడును లభింపలేదు. సౌందర్యవిలాసినియగు ప్రేమలత తన్ను సౌందర్యమునను, విలువిద్యయందును నేమొకట్ల తిక్రమించువాఁడగు చంద్రసేనునికిఁ దన హృదయరాజ్యమునంకితమిచ్చెను. కాని కాలగతి వక్రముగదా!

చంద్రసేనుని జనకుఁడగు రత్నసేనుఁడు స్వీయరాజ్యమగు నళినపురమును సర్వజన సంతోషకరముగా బరిపాలించుచుండఁ అచల్లని ప్రభుపాలనమున జనులునిల్లి యెల్లవిధసుఖములను జూఱగొనుచుండఁ దద్రాజ్యమున నొక రాజోద్యో

గియు రాజద్రోహియునగు చక్రపాలుఁడు నీతికి సహింపఁజాలక కొంతసైన్యమును స్వీకరించి, యు తనిని రాజ్యభ్రష్టుఁగావించి దానే స్వయముగా రాజ్యమును బరిపాలించుచుండెను. పాపము రత్న సేనుఁడు కుమారుఁడగు చంద్రసేనసహితముగా నే యూరిలోనో యెవరి యరణ్యములలోనో యజ్ఞాతవా సము చేయుచుండెను. ఇఁక వారిజాడయే లేదు. అయినను ప్రేమలత చంద్రసేనునిమీఁదనే య నురాగమువహించి యతఁడు లభింపనిచో యావ జ్జీవమును బ్రహ్మచర్యమును సలుపఁ గృతనిశ్చయు రాలయ్యెను.

## రెండవ ప్రకరణము.

### వివాహ నిశ్చయము.

---

మన కథాకాలమునాఁటికి, ఆనందపురము సకలసంపదలకు సదనమై, భరతఖండమందు తల మానికమువలెఁ దనరారుచుండెను. తత్పురపరిపా లకుఁడు వశపాలుఁడు. అతఁడు గర్వాంధుఁడు. గర్వ

మొట్టి వారినైనను జెఱచునుగదా! కాని కనకపాలుని రాజ్యమదాంధతవలన నాతనిగర్వముకూడనిర ఘూటముగా సాగిపోవుచుండెను. అనలమున కనిలము తోడ్పడినట్లుగా దుర్గుణసముపేతుఁడగు కనకపాలునికి కుబుద్ధియగు రఘునాథుఁడను మంత్రితోడయి యనేకవిధములగు దుర్మార్గత్వము లుపదేశించుచు రాజును మఱింత క్రూరునిగాఁ జేసివైచెను. ఇఁక నా కనకపాలుఁడు తనదుష్టమంత్రి సహాయమున జేయుని దుష్కార్యమేమున్నదని? అతఁడు చేయు ఘోరకృత్యములన్నిటిలో ముఖ్యమగుపని జనులను బీడించుటే? అతఁడు బీదలనక, సాదలనక ధనికులనక, ధార్మికులనక, వీరనక, వారనక తోఁచినవారందఱియొద్ద నిష్టమువచ్చినంత ధనమపహరించి యాఅన్యాయపుధనముతోఁ దనబొక్కసము నింపుకొనఁజొచ్చెను. కావున జనులందఱును తమకీ రాజుబాధ తొలఁగింపుమని తమతమ యిష్టదేవతలకు వేవిధముల మ్రొక్కుకొనుచుండిరి

కనకపాలునికి రాజసేనుఁడను నొకపుత్త్రుఁడుగలఁడు. అతఁడును తండ్రివలెనే దుష్టుఁడు. అంతఁగా పాండవర్ధనిపతుఁడుగా నున్నను కురూపిమా

త్రముగాఁ గనుఁ. అతఁడొకనాఁ డంతఃపురమున నుండఁగా చారులింతలో నొక చిత్రపటముఁదెచ్చి చూపిరి. అతఁడిదివఱకెందఱో రాజపుత్రికలను జూచెనుగాని యందముఁ జిత్రింపఁబడిన సుందరివంటి సుందరిని జూడఁ లేఁడు. ఆ పటమును జూడఁగానే యందము చిత్రింపబడియున్న హేమలతపై మోహము జనించెను. తుదకెట్టిదైన ప్రయత్నముల చేతనైనను నామెను పెండ్లాడవలయునని నిశ్చయించుకొనెను. రాజాధిరాజకుమారుఁడట్లు రాజసేనునకు కార్యకాకలెక్కలోనిది కాదుగదా! అతఁడు తన జనకునితోఁ దన వాంఛితము దెలియఁజేసెను. ఆదిమంత్రియగు రఘునాథుఁడు వచ్చి, రాజసేనునకు ధైర్యములు చెప్పుచు "రాజకుమారా! ఇందులకై నీవు చింతింపనేల? ఇదెంతపని, మాహేంద్రుఁడు మన చేతిలోనివాఁడేకదా! అతఁడు మన సంబంధముఁ జేసికొనుటకిష్టపడకుండునా? అతఁడు వేయేండ్లు తలక్రిందయి తపస్సుచేసినను మనయట్టి రాజాధిరాజుల సంబంధము దొరకునా? ఇఁక మీరా విషయమై సందియము వీఁడుము. హేమలత మీదియని నమ్ముడు. మన సందేశముఁ జెప్పినచో మాహేంద్రవర్మ

శతగుణంబు లధికమయ్యెను. అందువలన రాజు కూడ దుఃఖార్ణవ నిమగ్న మనస్కుఁడై వర్తించు చుండెను. అట్టి సమయమున, రాజసేనుఁ డెవ్వరికిని దెలియకుండ, ప్రేమలతాన్వేషణార్థ మిల్లు వదలి దేశ దేశములు వెదకుచుండెను.



## అయిదవ ప్రకరణము.

### మతవృత్తాంతము.

---

నళినపురమత్యంత సౌందర్యవంతమైనది. దానిని మొదట రత్నసేనుఁడను రాజు పరిపాలించు చుండెను. ఈరత్నసేనుఁడే ప్రేమలత మోహించిన చంద్రసేనునితండ్రి. వీరినిగూర్చియు వీరి రాజ్య భ్రష్టత్వము గూర్చియు మొదటిప్రకరణమున జెప్పఁబడినది. అట్లాతని రాజ్యమును హరించిన యూతఁడు చక్రపాలుఁడు. అతనికి రాజ్యతృష్ణయత్యధికము.

నానావిధములఁ బ్రజలఁబీడించి వారివలన ధనము నాకర్షించుటలో నాతనికాసక్తి హెచ్చు. కాకులనుగొట్టి గ్రద్దలకు వేసినట్లు దీనులగు ప్రజలవలన ధనమాకర్షించి సోమరిపోతులును కొండెకాండ్రునగు మిత్రులకిచ్చి దుర్వినియోగము చేయుచుండెను. అతనికి యోగులందును యోగసిద్ధులందును నెక్కుడు విశ్వాసము. దుర్వ్యసనాసక్తుఁడగు చక్రపాలుని కెంత ధనాదాయమున్నను చాలక పోవుటచే యోగులదయను సంపాదించి స్వర్ణయోగసిద్ధిని బడయవలెనని కుతూహలియైయుండి, వచ్చినయోగులనెల్ల నాదరించుటయేకాక వారికి నివసింపఁదగినమఠము నొకటి కట్టించియిచ్చెను. అందు చిదానందస్వరూపులగు యోగులెల్లప్పుడును నివసించుటచే దానికానందమఠమని పేరిడెను. రాజాదరణముండుటచేఁ బెక్కండ్రు యోగులు వచ్చి కొంతకాలమటనివసించి పోవుచుండిరి. కొందఱు చిరకాలమచ్చటనేయుందురు. వారిలో చిదానందయోగి ప్రధానుఁడని చెప్పవచ్చును.

ఈచిదానందయోగి మహా మహిమగల వాఁడని యోగులకేకాక ప్రజలకుఁగూడ నమ్మక

ముగలదు. అతఁడు జనసమ్మర్దముగల నగరప్రాం
తమునను న్న తనవమూఢికి భంగముగల్గునని కాఁ
బోలు, బవ ల్లెల్ల నేయరణ్యములోనో తపమాచరిం
చి యర్ధరాత్రిమప్పుడు వచ్చుచుండును. అచిదా
నందునిమహిమవిని చక్రపాలుఁడాతని సందర్శన
ము గావించుకొననెంతయో యత్నించుచుండెను.
కాని యాతనికోర్కె యిప్పటికిని సిద్ధింపలేదు. అం
దులకుఁ గారణము చిదానందుఁడు తెలుచుగా నచ్చు
ట లేకపోవుటయే. అతఁడు తెలుచుగా నరణ్యము
లోనున్నను లోకవృత్తాంతములను యథార్థము
గాఁ జెప్పుచుండుటచే నతఁడు త్రికాలజ్ఞుఁడని ప్ర
జలు నమ్మిరి.

ఒకనాఁడతఁడు వనమునుండి వచ్చుచుండ
మార్గమధ్యమున నొక యార్తస్వరమాతనికి విన
వచ్చెను. అతఁడు త్వరపడి యాధ్వనివచ్చుదిక్కు
నరిగెను. అచ్చట నల్గురుపురుషులొక యువతిని
[illegible]కొని బాధించుచుండిరి. పరోపకారియగు నా
యోగి చేతికఱ్ఱయందు గుప్తముగానున్న ఖడ్గము
ను దీసికొని యాదుష్టులపైఁబడి చావఁగొట్టి యా
యువతిని విడిపించెను. ఆదుష్టులు పారిపోయిరి.

అపుడు యోగి, యోగినీవేషముతో నున్న యా యువతినిగాంచి "యువతీ! నీ వీ కష్టముల కెట్లు చిక్కితివి? నీ వృత్తాంత మేమ"ని యడిగెను. దానికామె "అయ్యా! నే నొక దీనురాలను. సంసార కష్టములకు రోసి, సుఖప్రదమగు నీయోగాశ్రమ మవలంబించి యిచ్చట యీవనాంతమున నొక మహాయోగి యున్నాడని విని యాతని యనుగ్రహమున నా కష్టములు గట్టెక్కించుకొనవలెనని వచ్చుచుండ దుష్టులెవ్వరో నన్ను మోహించి పలుబాములఁ బెట్టసాగిరి. నీవు నా పాలిట దైవమువలె వచ్చి రక్షించితివి. నీకు నమస్కారము. నన్ను చిదానందమఠమునకుఁ జేర్చి పుణ్యముగట్టుకొమ్ము. మఱియు నా మహాత్ముని సందర్శనము నాకుఁ గల్గింతువేని నేను నీకు యావజ్జీవమును కృతజ్ఞురాలనై యుందు"నని పలుక నా యోగి యామెకుఁ దన వృత్తాంతము దెలిపి తన మఠమునకుఁ గొనిపోయెను.



# ఆఱవ ప్రకరణము.

## దుష్ట శిక్షణము.

---

దివాకరుఁడు గగనమధ్య భాగము నలంకరించి మిడుగురులు గురియుచున్న సమయమున నొక యోగీశ్వరుఁడానందమఠమునకు వచ్చెను. ఆతని వయస్సు సుమారిరువది వత్సరము లుండును. ఆతని దేహము బలిష్ఠమై సామాన్య యోగి జనులను పోలియుండలేదు. అతని ముఖమును జూచినను, వాగ్ధోరణిని వినినను ఉత్తమ వంశ సంభూతుఁడని తెలియును. ఆతఁడు మఠమున బ్రవేశింపగనే అచ్చట యోగులతనిని బలుగతుల గౌరవించి యతిథి సత్కారములు సలిపిరి. ఈనూతన యోగియు వారి యాతిథ్యమునకుఁదనిసి వారి కోరిక చొప్పున నానంద దాయకమగు నామఠమున గొన్ని దినములుండ నెంచెను. ఇతఁడచ్చటి గదులలో నొకదానియందు విడిసెను. అతఁడు

నివసించియున్న గదికి సమీపముగానే బాలయోగిని, నివసించుచుండెను. ఆమె సత్ప్రవర్తన గలదై, సౌందర్యమునకు నిధానమై, చిదానందుని శిష్యులలో నొకతెయై సర్వదా దైవమును పూజించు కొనుచుండెను. ఆమఠములోని యోగులందఱు నామెను తమసోదరిగా భావించుచు గౌరవించుచుండిరి. ఒకనాడు ఆమెయీనూతన యోగిదృష్టిపథమున బడెను. ఏకారణముచేతనో గాని యీనూతన యోగి యామెను చూచినప్పటి నుండియు తహతహలాడుచు యోగిజన విరుద్ధమగు వికారమునకు లోనయ్యెను. ఆతని మనస్సులో [illegible] దుశ్చింతలు పొడమెను గాని యవి యెవ్వరికిని తెలియుటలేదు.

ఒకనాటి రాత్రియందఱునిద్రించియుండఁగా నీయోగి, బాలయోగినిని సమీపించెను. విచారాకులిత హృదయయగుటచే వినిద్రయైయున్న యోగిని యాతనిం గాంచి "ఎవ్వరు" అని ప్రశ్నించెను. అతఁడామెనుజూచి "యువతీ! నీపూర్వ వృత్తాంతము నెఱుఁగుదును. నీవిట్లు దుఃఖముల పాలుగానేల? నీకై కుందుచున్న నీతల్లిదండ్రులను జేర్చెద ర

మిత్రుని తన వృత్తాంతమేదోఁ జెప్పెను. అంతట బాల యోగిని భయాకులిత చిత్తయై "సోదరా! పితృగృహము దుఃఖకరముగా నుండుట చేతనే యీమఠమున జేరితిని! దీనికింక జింతింపనేల? నీవు చూపిన దయకు కృతజ్ఞురాల" నని పలికి యూరకుండెను. అందుల కాతఁడేమియును జెప్పజాలక మఱల తన గదిలోనికిఁ బోయెను. ఇది జరిగిన రెండుదినముల కా నూతన యోగి యర్ధరాత్రమున గొందఱుదుష్టుల సాయముబడసి యా బాల యోగిని నోఁటగుడ్డలు గ్రుక్కి యెవ్వరికి దెలియకుండ యరణ్య మార్గము బట్టి పోసాగెను. ఆయోగిని తన దురవస్థకు లోలోన దుఃఖించుచు యాదుష్టుని బారినుండి దప్పించుకొన నుపాయము లేమి పలువేదనలఁబడుచుండెను. ఇంతలో దుష్టులడవిజొచ్చుటచే తమకింక నపాయము రాదని నిర్భయముగా పోవుచుండ నరణ్యమునుండి ఆనంద మఠమునకు వచ్చుచున్న చిదానందయోగి దారసిల్లెను. అతనిని జూడగానే ఆదుష్టులు కలవరపాటొంది పెడదారి ద్రొక్క యత్నింప నీయోగిపుంగవుఁడది గ్రహించి యెవరో దుష్టులకార్యము లా

చరించుచున్నారని గ్రహించి తన చేతికఱ్ఱ యందు గుప్తముగా నమర్పఁబడిన కత్తిని దీసి వారినెదుర్కొనఁగా వారిలో నొక్కరితని భీకరాకారముజూచి భయపడి పలాయితులైరి. వీరివెనుకవచ్చుచున్న నూతనయోగిమాత్రము వెనుదీయక వారినిబిల్చుచు దనగుప్తఖడ్గముఁ జేకొని యతనితో పోరాడఁగడఁగెను. కాని యతిబలిష్ఠుఁడగు చిదానందయోగి పరాక్రమమున కాఁగఁజాలక తత్ఖడ్గమున కెరయయ్యెను. అంతట నతఁడు మూలుగుచు పడియున్న బాలయోగినిఁజూచి ఈవ్యక్తి యెవ్వరని సమీపించి చూచి తనమఠమునందలి బాలయోగినియే యని పోల్చి కట్లువిప్పి యామెను స్వస్థచిత్తురాలినిగా నొనర్చెను. అతఁడప్పుడు "యువతీ! నీవృత్తాంతమేమి? ఈదుష్టులెవ్వర"ని యడుగ నామె దుఃఖించుచు నిట్లు చెప్పెను.

"ఆర్యా! నేనొక దురదృష్టవంతురాలను. మహేంద్రవర్మయాత్మజను. నన్ను బ్రేమలతయందురు. ఈవచ్చినదురాత్ముఁడు కనకపాలుఁడను మామఁడగు రాజసేనుఁడు. నేనవ్వరిని పెండ్లాడుటకొప్పక యీయాశ్రమమవలంబించితినో యాదుష్టా

తుమ్మబారినే నేఁడు పడవలసివచ్చినది. కాని మీ దయవలన,నీకష్టమునుండి తప్పించుకొంటి”యనిపలికి నూతనయోగి ఆనందపురమునకు వచ్చినదిమొదలప్పటివఱకు జరిగినవృత్తాంతము దెలియఁజేసెను. ఆమాటలు విన్నప్పటినుండియు, నెందుచేతనో చిదానందయోగి యాశ్చర్యమునేగాక, యానందము కూడపొంది యప్పటి నుండియు నామెను మఱింత యాదరించు చుండెను. అతఁడామెతో మఠమును జేఁగానే నామెను జాగ్రత్తగా నుపచరింపుఁడని శిష్యులందఱకును యాజ్ఞాపించెను.

## ఏ డ వ ప్ర క ర ణ ము.

### సమావేశము.

ఒకనాఁడు భాగ్యవశమునఁ జక్రపాలునికిఁ జిదానందుని సందర్శనము లభించెను. ఆరా జతనికి భక్తిపురస్సరముగా నమస్కరించి బద్ధాంజలియై నిలువఁబడియుండ నాయోగి యాతని కుచిత మర్యాదలు సల్పి కూర్చుండ నియోగించెను. రాజట్లు చేసి యాయోగి ప్రభావమును మిక్కిలి స్తుతించెను. అందులకు యోగి ప్రసన్నుఁడై

కుశల ప్రశ్నమడిగి "నీ! పరిపాలన మెట్లున్నది నీవును బ్రజలును సుఖులై యున్నారా" యనెను. అది విని రాజు "యోగీంద్రా! సాధ్యమగునంత వఱకు ధర్మయుక్తముగానే పాలించుచున్నాను. అప్పటికిని గొందఱు దుష్టహృదయులు నాకు వ్యతిరిక్తముగా వర్తించుచున్నారు. అందువలన నాకును బ్రజలకును సుఖ మలవడకున్నది. ఆ రాజద్రోహులను గొలదికాలములోనే మట్టు పెట్టెదన"ని పలికెను. అదివిని యోగి కొంచెము యోజించి "ఓ రాజేంద్రా! రాజద్రోహుల యెడఁ సామమువలె దండోపాయము పనిచేయదు. దండ ముపయోగించిన మఱింత చెలరేగుదురు. యోగిజనమున కాశ్రయమిచ్చిన యుదారుఁడవు గాన నీయందు నాకు వాత్సల్య మంకురించినది. వా రెవ్వరో చెప్పెదవేని నేనుబోయి వారి దౌర్జన్యము ను దొలంగించెద"నని పలికెను. అందులకు రాజు సంతసించి రాజద్రోహులను దెలిపెను. చిదానందుడు రాత్రిసమయములందు వారి యిండ్లకేగి యేదేదో బోధించెను. అతని తో రాజద్రోహులందఱును సుముఖులైరి.

వాఁడదిగాంచి మిక్కిలి సంతసించి యోగి ప్రభావము నుతించెను. అదిమొదలా యోగియం దతని కధిక విశ్వాస ముదయించెను.

మఱొక్కనాఁడు రాజు యథోచిత వేషముతో యోగిని దర్శించి "మహాత్మా! తమ ప్రభావమువలన ద్రోహు లడుగంటిరి. నా రాజ్యము సుభిక్షమయ్యెను. కాని నా కింకొక్క కోరిక గలదు. తమవంటివారికి యోగసిద్ధులు వశమై యుండును. దయయుంచి స్వర్ణయోగ ప్రక్రియ నా కుపదేశించినచోఁ జన్మాలమున మఱింత ధనము సంపాదించి మీ రౌగికులమును మఱింత యాదరింతును." అని తన మనోరథము దెలియ జేసెను. అంతనా యోగి "రాజా! ఇది సాధారణముగాఁ బ్రతి మానవునకును బట్టుబడు విద్య కాదు. దానియం దెంతో శ్రద్ధవహించిన వారికే యది ఫలింపకుండును. అనేకులగు రాజులిట్లే నన్నుఁ గోరి యడిగి నేర్చుకొనియు వ్యర్థమనోరథు లయిరి. అయినను నీవు యోగ్యుఁడవగుటచే నీ కాతంత్రము నుపదేశించుట కాటంకము లేదు. రాఁబోవు నమావాస్యనాఁటి కిచ్చటికి రమ్ము. అప్పుడు నీకు నేను

ఉత్కృష్టమై తంత్ర ముపదేశించెదను. పిమ్మట దానిని బునశ్చరణ మొనరించువిధములోనుగాఁ గల యావత్సంగతు లప్పుడే చెప్పెదను. కావున నానాఁడు రమ్ము" అని పలికెను. అది విని చక్రపాలుఁడు మహానందముతోఁ వెడలిపోయెను.

## ఎనిమిదవ ప్రకరణము.

## పరిసమాప్తి.

చిదానందయోగి చెప్పిన దినమరుదెంచెను. చక్రపాలుఁడతని యానతిచే నానందమఠమునకుఁ జుట్టుపట్లనున్న ప్రదేశములందు జనసంచారము లేకుండఁ జేసెను. అందువలన నారాత్రి మఱింత నిశ్శబ్దమయ్యెను. అట్టి సమయమున జక్రపాలుఁడు చితవేషధారియై యోగిని సందర్శించెను. అతనిం గాంచి యోగి "రాజా! వచ్చితివా?" యని పలికి స్వర్ణయోగతంత్రమాతని చెవిలో నుపదేశించి "దీనిని నీవు మిక్కిలి జాగరూకతతోడ నాచరింపవలెను. కుత్తుకబంటినీటిలో నర్ధరాత్రమున ధ్యానింపవలయును. ఇట్లు జేసినచో, నీకభీష్టసిద్ధియగును. మఱియా నీవు ధ్యానించునసమయమున చంచలుఁడవై

యుండరాదు. ఏకాగ్రచిత్తుఁడవై యుండవలెను. ఎట్టి చప్పుడైనను మనస్సు ద్రిప్పుకొనరాదు." అని బోధించెను. రాజు వల్లెయని వదలిపోయి మఱుదివసంబునుండియు నట్లొనరింపసాగెను.

ఒకనాఁడతఁడు నీళ్ళలో నిలువఁబడి ధ్యానించుచుండఁగా నటనేదో చప్పుడయ్యెను. కాని యందులకుఁ జక్రపాలుఁడేమియు లక్ష్యపెట్టక ధ్యానించుచునేయుండెను. కాని యంతకంతకు తనకెవ్వరో తనదిక్కునకీడ్చుకొని వచ్చుచున్నట్లయ్యెను. అప్పటికిని అతఁడు నిశ్చలితుఁడైయుండఁగా నైదు నిమిషములు దాఁటగానే నీఁటిలోనుండి యెవ్వరో దన్ను కాళ్ళుపట్టుకొని లాగినట్లు దోఁచెను. ఇంతటితో నతనికి మనస్సుండఁబట్టక తన్నెవ్వరో నీటిలో ముంచుటకెంచుచున్నారని యెఱిఁగి కన్నులు విప్పి జూచెను. కాని యంతలోనే యొకవ్యక్తి గబగబ నీటిలోనికి వచ్చి వానిమెతిపిని నీటిలోనిక ముంచివేసెను. ఇంతటితో, చక్రపాలుని జీవితము సమాప్తమైనది. లోనుండి యొకదివ్యమంగళవిగ్రహము వచ్చెను. అతఁడూరిలోనికిఁజని చక్రపాలుఁడు చనిపోయినసంగతి వెల్లడిజేసెను. అతఁడే

చక్రపాలుని నీటముంచినవాఁడు.

జనులు కొంద ఱాతని పోలికపట్టిరి! వారు "ఎంతయాశ్చర్యము! ఇది సంభవమా!" అని కేక వేసిరి. అంతటికిని ఆతఁడన్యాయో తెలిసెను. జనులెల్లరేకగ్రీవమున చంద్రునిజూచిన సముద్రమురీతి "జై చంద్రసేన యువరాజునకు జై!" యని కేక వేసిరి! జరిగిన ఘోర కార్యమును గ్రహించి చక్రపాలుని హితులు రేగించి, చంద్రసేనునెదుర్కొనిరి. కాని మహాపరాక్రమశాలియగు నతఁడు మిత్రుల సహాయమున నా రాజద్రోహులను బూతిఁగా నశింపఁజేసెను. మఱునాఁడు గొప్ప యుత్సవమయ్యెను. జనకంటకుఁడగు చక్రపాలుఁడు నశించిపోవుటయు, పూర్వపు యువరాజగు చంద్రసేనుఁడు తమ కన్నులఁబడుటయు జూచి జనులొందిన సంతోషమునకు మేర లేకపోయెను. చంద్రసేనుఁడు తనవృత్తాంతమంతయు దెల్పెను. జనులు "ఆహా! ఏమాశ్చర్యము! ఇన్నినాళ్ళ పురమునవసించి మమ్ములను సంతసింపజేసిన చిదానందుఁడీతఁడాయని యెఱిఁగి యనిర్వచనీయానందముఁ బొందిరి.

ఆనందమగ్నమగుచున్న ప్రేమలతకీవృత్తాంత

ము దెలిసెను. ఆమెకిదివఱలో నితఁడు చంద్రసేనుఁడగు నేమోయన్న యనుమానమంకురించుచుండెను. ఇప్పుడా సందేహమంతయుఁ దొలఁగిపోయెను. ఆమె మహావైభవముతో రాజాంతఃపురమునకు దీసికొనిరాబడియెను.

చంద్రసేనుని తండ్రియగు రత్నసేనుఁడు గూడ నానందమఠములోనే యుండెను. అతఁడు కూడ రాజభవనమునకు వచ్చెను. తమ పూర్వపు రాజును జూడగలంగినందుకు జనులు పొందిన సంతోషమునకు మేరలేదయ్యెను. కాని చక్రపాలుని రాతులు కొందఱు రత్నసేనుని కెదురుతిరిగిరి. వారిని చంద్రసేనుఁడు పూర్వమువలె నిర్మూలమొనరించి నళినపుర రాజ్యమును నిష్కంటక మొనరించెను.

ఈవృత్తాంతమును హేంద్రవర్మకుఁ దెలియజేయఁ దన కుమారిక క్షేమసమాచార మెఱింగి మహానంద భరితుఁడై సపరివారముగ నళినపురమున కేఁగుదెంచెను. అచ్చట కొంతకాలముండిన పిమ్మట నతఁడు రత్నసేనునితోఁ గనకపాలుని గూర్చియు వానిదుర్నయములను గూర్చియు దెలియఁజేసెను. రత్నసేనుఁడు క్రోధోదగ్రుండై "ఏమీ! వీఁడింతటివాఁడ

మ్యునా? వీనిని మట్టుబెట్టవలెనని యెంచి మహేంద్రవర్మ రత్నసేనులు తమసేనలా కటిగా గూర్చి కనకపాలునిపై దండెత్తిపోయిరి. పుత్రశోకఖిన్నాత్ముఁడై యున్న కనకపాలుఁడీవార్త విని పౌరుషవంతుఁడై ఘోరముగాఁబోరి వీరస్వర్గముగాంచెను.

తదనంతరము మహేంద్రవర్మ తనకూఁతురగు ప్రేమలతను, నామెయభిలషితవరుఁడగు చంద్రసేనునికిచ్చి, మహావైభవముతోఁ బెండ్లిజేసి నళినపురరాజ్ఞీమణిగా నొనరించి తానునిశ్చింతుఁడై తన నగరమును బరిపాలించుకొనుచుండెను. సుగుణవతియగు ప్రేమలత పలుకష్టముల పాలయ్యెఁ జిన్నప్పటి నుండియుఁ దనప్రేమలత కాశ్రయముగావించిన యుత్తమునిఁ జేపట్టి, తననామము సార్థకముగావించుకొనెను. రత్నసేనుఁడు తనకుమారునికి తనస్వీయరాజ్యమగు నళినపురమునకును కనకపాలునిరాజ్యమగు నానందపురమునకును, పట్టాభిషేకముగట్టి తన రాజ్యభారము తొలఁగించుకొనెను. చంద్రసేనుఁడు ప్రియసతీరత్నమగు ప్రేమలతతోఁ గూడి మహావైభవముతో నానందనళినపురములను బరిపాలించుచు పుత్రపౌత్రాభివృద్ధిని జెంది సుఖించుచుండెను.

—:సమాప్తము:—